ఇందులో

# సమర్పణ

నేను రాసిన కథలలో యివి కొన్ని.

నాకథలన్నీ అత్యుత్సాహంతో చదువుతున్న తెలుగు పిల్లలకు–

చిన్ననాటి నుంచీ అన్ని విధాలా ప్రోత్సాహమిచ్చి, ప్రతిభను ప్రకాశింపజేసిన అన్నయ్య వీరాజీకి–

# కృతజ్ఞత

నా కథలను తమ పత్రికలలో ప్రచురించిన పత్రికా సంపాదకులకు–

ఆ కథలను పుస్తకరూపంలో ప్రచురించిన ప్రచురణ కర్తలకు–

రచయిత.

# దీపకరాగం - మేఘమల్లార్ రాగం

ఢిల్లీ నగరాన్ని మొగలాయి చక్రవర్తి అయిన అక్బర్ పాదుషా పరిపాలిస్తున్నాడు.

అక్బర్ పాదుషా ఆస్థానంలోవున్న వాళ్ళలో చెప్పుకో దగ్గవారు యిద్దరు వున్నారు.

ఒకాయన ఆస్థాన గాయకుడు. అతనిపేరు తాన్‌సేన్.

రెండో ఆయన బీర్‌బల్. అతను ఆస్థాన విదూషకుడు.

వాళ్ళిద్దరూకూడా అక్బర్ పాదుషాకి ప్రాణసమానులు.

ఇలా వుండగా,

ఒకనాడు అక్బర్ పాదుషా బీర్‌బల్‌తో ఏవో సంగతులు పిచ్చాపాటిగా మాట్లాడుతున్నాడు.

అప్పుడు బీర్‌బల్ 'ప్రభూ! మీరు ఎప్పుడయినా దీపకరాగం విన్నారా?' అని అడిగాడు.

'ఊహుఁ! వినలేదు' అన్నాడు అక్బర్ పాదుషా.

'ప్రభూ! నేనుకూడా వినలేదు. కానీ ఆ దీపకరాగం ఆలాపిస్తూవుంటే దీపాలు వెలుగుతాయిట! ఆ రాగం ఎలా వుంటుందో ఒక్కసారి వినాలని వుంది' అన్నాడు బీర్‌బల్.

'దానికేం! మన తాన్‌సేన్ ఉన్నాడుగా! అతగాడికి రాని రాగమంటూ లేదు. రేపు ఆయనచేత పాడిదాం!' అన్నాడు అక్బర్ పాదుషా.

'సరే' నంటూ పాదుషాదగ్గర సెలవు తీసుకొని వెళ్ళి పోయూడు బీర్‌బల్.

అన్నప్రకారం అక్బర్ పాదుషా మర్నాడు సభలో తాన్‌సేన్‌కి యీ విషయం చెప్పేడు.

దీపకరాగం వినిపించమని కోరేడు.

దాంతో తాన్‌సేన్ గుండె గుభేలుమంది!

ఎంచేతనంటే, దీపకరాగం విన్నవాళ్ళకి వీనుల విందు గానే ఉంటుంది కానీ, పాడినవాళ్ళ ఆరోగ్యం మాత్రం ఆక్షణంనుంచీ పాడయి పోతుందిట!

అంచేతనే తాన్‌సేన్ అందుకు సమ్మతించలేదు.

కానీ, అక్బర్‌పాదుషా మాత్రం 'పాడితీరాలి'అంటూ ఆజ్ఞాపించేడు.

అక్బర్ పాదుషా ఆస్థానంలో వుంటూ, అతనివల్ల జీవిస్తూన్న తాన్‌సేన్ అతనిమాటని ఏవిధంగా కాదనగలడు?

గత్యంతరంలేక దీపకరాగం పాడి బీర్‌బల్‌కీ, అక్బర్ పాదుషాకీ వినిపించేడు తాన్‌సేన్.

'దీపకరాగం యింత బాగుంటుందని మాట మాత్రంగా నయినా అనలేదేం?' అంటూ అడిగాడు అక్బర్‌పాదుషా, తాన్‌సేన్‌ని.

తర్వాత, తాన్‌సేన్‌కి ఎన్నో బహుమతులను యిచ్చి సత్కరించాడు.

తాన్‌సేన్ దీపకరాగం ఎప్పుడయితే పాడి వినిపించేడో అప్పటినుంచీ అతని గుండెల్లో ఒక విధమయిన మంట బయలు దేరింది!

ఆ మంట గుండెల్లో గుబగుబ లాడిస్తూ వుంటే... తాన్‌సేన్ భరించలేక పోయాడు.

రాజవైద్యు లెవరూకూడా అందుకు తగిన చికిత్స చేయలేక పోయారు.

'ప్రభూ! దీపకరాగం వచ్చిన వాళ్లెవ్వరూకూడా... ఒకరి దగ్గర పాడి వినిపించకూడదు! అలాపాడి వినిపిస్తే యిలాగే జరుగుతుంది! దీనికి మందులేదు!' అని చెప్పారు కొందరు.

'దీనికి మేఘమల్లార్ రాగం ఒక్కటే విరుగుడు ప్రభూ! అది పాడినా, విన్నాకూడా యీ మంట తగ్గిపోతుంది!' అని చెప్పేరు మరికొందరు వైద్యులు.

'అయితే, మేఘమల్లార్ రాగం పాడు!' అన్నాడు అక్బరుపాదుషా.

'నాకు రాదు' అన్నాడు తాన్‌సేన్.

తాన్‌సేన్‌కే రాని మేఘమల్లార్ రాగం మిగతావారికి మాత్రం ఎలా వస్తుందీ?

అప్పుడు మరికొందరు వైద్యులు 'ప్రభూ! ఈయన్ని చల్లని నదీతీరానికి పంపిస్తే ఈ వ్యాధి ఉపశమిస్తుంది!' అని చెప్పేరు.

శబర్మతీ నది గుజరాత్ రాష్ట్రంలో వుంది. అక్కడ చాలా ప్రశాంతంగా వుంటుంది. కాబట్టి, అక్కడికే పంపమని సలహా యిచ్చారు మరి కొందరు.

సరే, అక్బర్ పాదుషా దగ్గర సెలవు తీసుకొని శబర్మతీ నదీ తీరానికి వెళ్లాడు తాన్‌సేన్.

నదీతీరాన్న చక్కటి కుటీరం వేసుకొని, అక్కడ ఒంటరిగా విశ్రాంతి తీసుకుంటున్నాడు.

అప్పుడు మొగలాయిలు గుజరాత్ రాష్ట్రాన్ని ఎలాగయినా వశం చేసుకుందామని చూస్తున్నారు.

ఆ కారణంచేత గుజరాత్ రాష్ట్రంలో వున్న ప్రజలు గుప్పిట్లో ప్రాణాలు పెట్టుకొని జీవిస్తున్నారు.

ఆకారణంచేతనే అక్కడిస్త్రీలు అంతా బాగా చీకటి ఉండగానే, అంటే తెల్లవారుఝామునే లేచి, నదికి వెళ్ళి నీళ్ళు తెచ్చుకుంటూ ఉండేవాళ్ళు.

తెల్లవారేసరికి నదీతీరాన్న కానీ, ఊళ్లో కానీ ఒక్క ఆడపడుచుకూడా కనిపించేదికాదు!

ఆవాళ తాన్‌సేన్ గుండెల్లో బాధ ఎక్కువగా వున్నందువల్ల అర్ధరాత్రి లేచి నదీతీరాన్న చల్లగాలికి కూర్చున్నాడు.

చల్లగాలిలో కూర్చున్న తాన్‌సేన్‌కి కాలంకూడా తెలీకండానే జరిగి పోయింది.

తెల్లవారుఝాము అయేసరికి వూళ్లోని ఆడవాళ్ళందరూ బిందెలూ, కుండలూ తీసుకొని నదికి నీళ్ళకి వచ్చారు.

అలా నీళ్లు పట్టుకుంటున్న స్త్రీలలో ఓ అమ్మాయి, పక్క నున్న అమ్మాయితో 'ఆయ నెవరోగానీ దీపకరాగం ఆలాపించి బాధపడుతున్నట్టుగా ఉన్నారే!' అంది.

'ఏమో అలాగేవుంది!' అన్నది అవతలి అమ్మాయి.

'అక్కా! దీపకరాగానికి విరుగుడు మేఘమల్లార్ కాదూ?' అడిగింది మొదటి అమ్మాయి.

'ఔనుకానీ మనకెందుకూ? ఊరుకో!' అంది రెండో అమ్మాయి.

కళ్ళు మూసుకొని వున్నా-మేల్కొనేవున్న తాన్ సేన్ యీ మాటలువిని కళ్ళు విప్పిచూశాడు.

మెట్లమీద యిద్దరు అమ్మాయిలు కనిపించేరు.

ఆ యిద్దరూకూడా అందంగా, నాజూగ్గా ఉన్నారు.

యిద్దరూ ఓకే వయస్సులో వున్నట్టు ఉన్నారు. ఇద్దరి పోలికలూ బాగా కలిశాయి.

వాళ్ళిద్దరూ తాన్ సేన్ కదలడం చూసి గబగబా నీళ్ళు ముంచుకొని వెళ్ళిపో బోయారు.

తాన్ సేన్ గభాలున లేచి 'అమ్మా! చిన్నమాట!' అన్నాడు.

వాళ్ళు ఆగలేదు. నడక ప్రారంభించారు.

కానీ, తాన్ సేన్ మరింత వేగంగా నడుస్తూ 'చెల్లె మ్మలూ! ఆగండి! చిన్నమాట!' అంటూ వాళ్ళను వెంబ డించాడు.

గత్యంతరం లేక వాళ్ళిద్దరూ మేలిముసుగులు సవరిం చుకొని నుంచుండిపోయారు.

'చెల్లెమ్మలూ! నేను దీపకరాగం ఆలాపించి బాధ పడుతున్నానని మీకెలా తెలిసిందో చెప్పండి!' అంటూ వాళ్ళను అడిగాడు తాన్ సేన్.

"ఏం లేదండీ! మా అక్కకి కొంచెం సంగీతం వచ్చు నండీ! అంతే!" అంటూ ధైర్యం తెచ్చుకొని చెప్పింది చిన్న అమ్మాయి.

"అలాగా !" అంటూ వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు తాన్‌సేన్.

తాన్‌సేన్‌కి వాళ్ళతో మళ్ళీ మాట్లాడాలనిపించింది,

తన బాధని వాళ్ళ ముందు వెళ్ళగక్కు కోవాలనిపించింది.

అంచేతనే ఆ మర్నాడు కూడా తొందరగా మేల్కొని ముందురోజు తను పడుకున్న స్థలంలోనే కూర్చున్నాడు.

మామూల్గాలుగా అక్కచెల్లెళ్ళిద్దరూ అక్కడికి వచ్చారు.

తాన్‌సేన్ చిన్న అమ్మాయిని పలకరించేడు.

తర్వాత, "అమ్మా! మనసులోని బాధ చెప్పుకుంటే కొంత తగ్గుతుందంటారు. అంచేత మీరు వింటానంటే నా బాధనంతా మీకు చెప్పాలని కోరికగా వుంది!" అన్నాడు తాన్‌సేన్.

అతను అంతగా ప్రాధేయ పడుతున్నప్పుడు కాదనలేక పోయారు ఆ అక్కచెల్లెళ్ళు.

"సరేను" అన్నారు.

"మీ పేర్లేమిటమ్మా?" అని అడిగాడు తాన్‌సేన్.

వాళ్ళు మాట్లాడలేదు.

"అన్న ముందు కూడా దాపరికం ఉంటుందా తల్లీ?" అని అడిగాడు తాన్‌సేన్.

అప్పుడు చిన్న అమ్మాయి "అక్కయ్య పేరు తానా. నాపేరు నానా." అని చెప్పింది.

"అయితే, నన్ను తాన్‌సేన్ అంటారు. నేను అక్బర్ పాదుషా ఆస్థాన గాయకుణ్ని!" అని చెప్పేడు తాన్‌సేన్.

తానా బిత్తరపోయి :

"తాన్‌సేనా? అక్బర్ పాదుషా!!" అంటూ గభాలున బిందె నెత్తుకుంది.

"నానా! వచ్చెయ్!" అంటూ పరిగెత్తింది.

నానా కూడా బిందెనెత్తుకుని పారిపోయింది.

తాన్‌సేన్ నివ్వెరపోయి నిరాశగా చూస్తూ ఉండి పోయాడు.

ఆ తర్వాత, రెండు మూడు రోజులు ఆ అక్క–చెల్లెళ్లు కనిపించ లేదు.

"అయ్యో! నేను వాళ్ళకెంత అపకారం చేశానూ!" అని వాపోయాడు తాన్‌సేన్.

రోజూ తెల్లవారు ఝామునే లేచి నదీతీరాన్న వాళ్ళ కోసం వళ్ళంతా కళ్ళు చేసుకొని చూస్తూ కూర్చొనేవాడు తాన్‌సేన్.

కానీ, వాళ్ళు రాలేదు.

ఆవాళ తెల్లవారుఝామున తాన్‌సేన్ ఈ తీరంనుంచి ఆ తీరంవరకూ నడుస్తూ వెళ్ళాడు.

అక్కడ యిద్దరూ కనిపించేరు.

'చెల్లెమ్మలూ! ఆగండి!' అన్నాడు తాన్‌సేన్.

అతని కంఠంలోని జీర, హృదయాన్ని కదిలించే ఆ పిలుపూ వినేసరికి తానా, నానా అడుగు ముందుకు వెయ్య లేక అలాగే నిల్చుండి పోయారు.

తర్వాత, తాన్‌సేన్ బ్రతిమాలేసరికి కాదనలేక, అతని కథ యావత్తూ ఆ అక్కచెల్లెళ్ళిద్దరూ విన్నారు.

'ఇదమ్మా జరిగిన సంగతి! పాదుషా వారిదగ్గర నేను కూడా ఒక ఉద్యోగినే కాబట్టి అతని కోరిక చెల్లించవలసి వచ్చింది.' అన్నాడు తాన్‌సేన్.

'అక్కా! అపకారికి కూడా ఉపకారమే చెయ్యమన్నారు పెద్దలు. ఇంతకీ, మనరాష్ట్రాన్ని వశపర్చుకోబోతున్నది అక్బర్ పాదుషా కానీ, ఈయన కాదుకదా! అదీగాక మనచేతుల్లో పనిగాబట్టి మనం ఈయన బాధ తీర్చడం మంచిదని నా ఉద్దేశం!' అంది నానా.

తాన్‌సేన్‌కి యిదేం అర్థం కాలేదు.

తానా ఒక్క క్షణంసేపు ఆలోచించి 'నానా! నీ యిష్టమే నా యిష్టం!' అన్నది.

'అన్నయ్యగారూ! రేపు తెల్లవారుఝామున మేము బాగా చీకటి ఉండగానే వచ్చేస్తాము. మీరు కూడా యిక్కడికే తప్పకుండా రండి!' అంది నానా.

'సరే' నన్నాడు కానీ, ఎందుకో ఏమిటో అతనికి తెలీదు.

ఎందుకూ, ఏమిటీ అని అడగనూ లేదు.

అక్కచెల్లెళ్ళిద్దరూ నీళ్ళు తీసుకొని వెళ్ళిపోయారు.

మర్నాడు తొలిఝామునే లేచి వాళ్ళు రమ్మన్న చోటుకే వెళ్ళాడు తాన్‌సేన్.

ఆవాళ పూర్ణిమ.

తాన్‌సేన్ ఆ పండు వెన్నెలలో కూర్చున్నాడు. చల్లని గాలి వీస్తోంది.

ఇంతలో తానా, నానా బిందెలు తీసుకొని వచ్చారు.

నానా తాన్‌సేన్ కుటీరానికి వెళ్ళి సితారా తీసుకొని వచ్చింది.

ఆ అక్క చెల్లెళ్ళిద్దరూ ఆపండు వెన్నెలలో, ప్రశాంత ప్రదేశంలో తీయగా మేఘమల్లార్ రాగం పాడి వినిపించేరు.

తాన్‌సేన్ హృదయం ద్రవించి పోయింది!

"అమ్మా! మీరు దేవతలు!" అన్నాడు తాన్‌సేన్.

ఆ అక్క చెల్లెళ్ళిద్దరూ ఆ మేఘమల్లార్ రాగం తాన్‌సేన్‌కి మూడు రాత్రులు పాడి వినిపించేరు!

తాన్‌సేన్ హృదయంలో రగులుతున్న అగ్నిజ్వాలలు ఆరిపోయాయి!

అతని మనసు చల్లబడింది!

ఆరోగ్యవంతుడు అయాడు.

తాన్‌సేన్ యేమిచ్చినా, యేమిస్తానన్నా కూడా ఒప్పుకోలేదు ఆ అక్క చెల్లెళ్ళిద్దరూ!

ఏమీ వద్దన్నారు.

"అన్నయ్యగారూ! మాకు మేఘమల్లార్ రాగం వచ్చినట్లుగా గానీ, మీకు వినిపించినట్టుగా కానీ, ఎవరితోనూ చెప్పవద్దు! అదే మాకు పదివేలు! అదే మాకు కానుక!" అన్నారు తానా, నానాలు.

'అలాగే!' నని ప్రమాణం చేశాడు తాన్‌సేన్.

తర్వాత, అతను ఢిల్లీనగరం చేరుకున్నాడు.

తాన్‌సేన్ ఆరోగ్యవంతుడై తిరిగి రావడం చూసి ఎంతో సంతోషించాడు అక్బర్ పాదుషా.

కానీ, మిగతా గాయకులు కొందరు కళ్ళుకుట్టుకున్నారు.

'ప్రభూ! తాన్‌సేన్ తనకి మేఘమల్లార్ రాగం రాదని మీతో అన్నాడు కదా! ఇప్పుడీ వ్యాధి ఎలా నయం అయిందంటారు? దీపక రాగానికి విరుగుడు ఒక్క మేఘమల్లార్ రాగం మాత్రమే! అది తప్పిస్తే మరోమందు యీ ప్రపంచంలోనే లేదు! తాన్‌సేన్ మేఘమల్లా రాగం వచ్చివుండీ కూడా మీతో రాదని అబద్ధం చెప్పేడు ప్రభూ!' అంటూ తాన్‌సేన్ మీద చాడీలు చెప్పేరు కొందరు అసూయాపరులు.

సామాన్యంగా నిజం కంటే అబద్ధం చెబితే తొందరగా నమ్ముతారు, మనుషులు.

అలాగే, అక్బర్ పాదుషా నిజమే ననుకున్నాడు.

తాన్‌సేన్‌ని పిలిపించి మేఘమల్లార్ రాగం పాడి వినిపించమన్నాడు.

తాన్‌సేన్ తనకి రాదన్నాడు.

కానీ, పాదుషా వినలేదు!

తాన్‌సేన్ ఎన్నోవిధాల మనవి చేసుకున్నాడు.

ఊఁ హుఁ పాదుషా నమ్మలేదు!

చెప్పాడు మాటలు బాగా బుర్రకెక్కిన అక్బర్ పాదుషా ఆఖరికి 'తాన్‌సేన్! నాకు ఏడు రోజుల్లోపల మేఘమల్లార్ రాగం పాడి వినిపించేవా సరేసరి! లేని పక్షంలో ప్రాణాలమీాద ఆశవదులుకో!' మని అన్నాడు.

తాన్‌సేన్‌కి యేమీా తోచింది కాదు!

చివరికి ఏడో రోజున తాన్‌సేన్ ప్రాణంమీాద తీపి కొద్దీ – అక్క చెల్లెళ్ళను గురించిన సంగతంతా వివరంగా చెప్పేశాడు!

'అయితే, ఇవాళే గుజరాత్ రాష్ట్రానికి వెళ్దాం!' అన్నాడు అక్బర్ పాదుషా.

'వద్దు ప్రభూ! వద్దు!' అన్నాడు తాన్‌సేన్.

'వీల్లేదు! నేను మేఘమల్లార్ రాగం వినితీరాలి!' అని పట్టుపట్టేడు అక్బర్ పాదుషా.

గత్యంతరం లేక తాన్‌సేన్ అక్బర్ పాదుషాని తీసుకొని శబర్మతీ నదీతీరానికి వెళ్ళాడు.

తెల్లవారు ఝామున తానా, నానాలను కలుసుకున్నాడు తాన్‌సేన్.

జరిగిన సంగతంతా చెప్పి 'ఇప్పుడుగానీ మీారు ఒప్పుకోపోతే–నా ప్రాణాలు దక్కవు!' అంటూ బ్రతిమాలుకున్నాడు.

తానా, నానా 'సరే' నని ఒప్పుకున్నారు!

తెల్లవారిగానే కొలువుకు వస్తాం అని చెప్పి వెళ్ళిపోయారు.

తెల్లవారింది.

అక్బర్ పాదుషా పెద్ద సభ ఏర్పాటు చేయించాడు.

తాన్‌సేన్, ప్రాణాలను పిడికిట్లో పెట్టుకొని కూర్చున్నాడు.

ఇంతలో అక్క చెల్లెళ్ళిద్దరూ రానేవచ్చారు.

తాన్‌సేన్ మనసు కుదటబడింది.

సభామధ్యంలో ఎత్తుగావున్న వేదికమీద కూర్చొని మేఘమల్హార్ రాగం ఆలాపించేరు తానా, నానాలు.

సభాసదులంతా కూడా నోళ్ళు వెళ్ళబెట్టి శిలాప్రతిమల్లా కూర్చుని పాట విన్నారు.

పాట పూర్తికాగానే అక్క చెల్లెళ్ళిద్దరూ లేచి నుంచున్నారు.

సభికులందరూ కరతాళధ్వనులు చేశారు.

అక్బర్ పాదుషా 'సెబాష్! సెబాష్!' అంటూ మెళ్లోనుంచి ముత్యాలహారాలు తీసి వాళ్ళమీదికి విసిరేడు.

తర్వాత, ఆ అక్క చెల్లెళ్ళిద్దరూ మెల్లగా యేదో మాట్లాడుకున్నారు.

ఆ తర్వాత ఆ యిద్దరూ ఒకర్నొకరు ఒక్కసారిగా కౌగలించుకున్నారు.

మరుక్షణంలోనే 'అమ్మా!' అన్న రెండు మూలుగులు వినిపించేయి.

అక్క చెల్లెళ్ళిద్దరూ కుప్పగా నేల కూలిపోయారు!

ఇద్దరి చేతుల్లోనూ నెత్తురు మయమయిన రెండు బాకులు ఉన్నాయి.

అదృశ్యం చూసిన తాన్‌సేన్ బిత్తరబోయాడు.

ఇంతలో యిద్దరు యువకులు పరిగెత్తికుంటూ సభ లోకి వచ్చేరు.

అక్క చెల్లెళ్ళ శవాలను చూసి భోరుమన్నారు.

వాళ్ళిద్దరూ తానా, నానాల భర్తలు.

తానా, నానాలు సభకూ వస్తూ యింటిదగ్గర భర్తలకి ఒక ఉత్తరం రాసి పెట్టి వచ్చారు.

ఆ ఉత్తరంలో—

'పూజనీయులయిన మీాకు అనేక నమస్కారాలతో వ్రాసినది: ఢిల్లీ చక్రవర్తి అయిన అక్బర్ పాదుషావారు మమ్మల్ని నిండు సభలో మేఘమల్లార్ రాగం పాడవలసిందిగా కోరేరు. కానీ, మాకు మీా అనుమతి తీసికుందికి కూడా సమయం చిక్కలేదు. అదీగాక, నిండు సభలో మగవాళ్ళ యెదుట పాటపాడిన మేము తిరిగి మీాకు యే విధంగా మా ముఖాలు చూపించగలం? మనజాతికీ, పతివ్రతా ధర్మానికీ, కళంకం తీసుకురావడం యిష్టంలేక మేము ఆ నిండు సభలోనే ఆత్మహత్య చేసుకుందికి నిశ్చయించుకున్నాం! మమ్మల్ని మనసారా క్షమిస్తారని ఆశిస్తాన్నాం! - మీా తానా, నానా.' అని రాసి వుంది.

ఉత్తరం అంతా విన్న అక్బర్ పాదుషా అలాగే స్తంభించిపోయి, తలదించుకున్నాడు.

తన ప్రాణాన్ని కాపాడిన అక్క చెల్లెళ్ళ ప్రాణాలను పొట్టనబెట్టుకున్న తాన్‌సేన్ కన్నీళ్ళు తుడుచుకున్నాడు.

"నా చెల్లెమ్మలు అమరజీవులు! వారు మరణించ లేదు!" అన్నాడు అప్రయత్నంగా తాన్‌సేన్.

ఆ అక్క చెల్లెళ్ళిద్దరి పేర్లనూ ప్రపంచంలో శాశ్వతంగా ఉండేలా చేయాలని అనుకున్నాడు.

అనుకున్నట్టుగానే-

అంతవరకూ సంగీతంలో 'ఓం' అని ఉన్నచోటనల్లా "తోమ్ తానా నానా" అంటూ వాళ్ల పేర్లను చేర్చేడు.

వాళ్లను తాను ప్రప్రథమంగా కలుసుకున్న స్థలంలో చక్కని సంగీత మందిరం కట్టించేడు.

ఇప్పుడు అక్బర్ పాదుషాగానీ, తాన్‌సేన్‌గానీ ఎవరూ లేరు!

తాన్‌సేన్ కట్టించిన సంగీత మందిరం కూడా శిథిలమయిపోయింది!

కానీ, సంగీత స్వరాలలో తాన్‌సేన్ చేర్చిన 'తానా నానా' పదాలు మాత్రం అలాగే ఉన్నాయి.

అలాగే ఉంటాయి!

—:o:—

# పశ్చాత్తాపము

గౌతమ బుద్ధుడు తన ప్రియశిష్యులను బౌద్ధ మత ప్రచారంకోసం పంపాలని నిశ్చయించుకున్నాడు.

ఓ నాడు శిష్యులందర్నీ సమావేశపర్చి - వాళ్ళకు మత బోధగురించి ఎన్నో విషయాలు చెప్పాడు. ఆఖరుసారిగా వాళ్ళను ఇలా హెచ్చరించాడు - "మీలో ఎవరూ కూడా ఎటువంటి పరిస్థితుల్లోనయినా సరే, మత ప్రచారంకోసం మాత్రం మానవాతీత కార్యాలుగానీ - అద్భుతాలుగాని చేయవద్దు !", అని.

తర్వాత వాళ్ళందరినీ అన్నివైపులకూ పంపివేశాడు.

ఆనందుడు మగధ సామ్రాజ్యం చేరుకున్నాడు. ఆ నాడు ప్రజలలో జీవహింసా, మత భేదాలూ ఎక్కువగా వున్నాయి. బ్రాహ్మణుల అహంకారానికీ, వాళ్ళ కట్టుదిట్టాలకీ లొంగి నలిగిపోతున్నారు ప్రజలు !

అటువంటి పరిస్థితుల్లో బౌద్ధమతం ప్రజలను ఆకర్షించింది. అంతేగాకుండా ఆనందుడి విగ్రహాపుష్టి మరింత పనికి వచ్చింది. ఆనందుడు పొడువుగా, బలంగా, గంభీరంగా వుండేవాడు. చక్కని వాక్చాతుర్యంకూడా వుంది. ఆనందుడు బౌద్ధ మతం గురించి - బోధిస్తూఉంటే ప్రజలు అలానే నుంచొని చెవులు అప్పగించేవాళ్ళు!

అతనిని, అతని గంభీర ఉపన్యాసాన్ని మెచ్చుకున్నారు ప్రజలు. ఎందరో బౌద్ధమతం స్వీకరించారు. ఆనందుడికి ఎప్పు డయితే కీర్తి వచ్చిందో - ఆనాడే అతనిలో గర్వం అన్నది పుట్టింది. తనంతటివారు లేడనుకున్నాడు. తన గంభీరమయిన గొంతూ, తన విగ్రహపుష్టి చూసి ప్రజలు బౌద్ధమతాన్ని మెచ్చుకున్నా రనుకున్నాడు.

ఆనందుడిలో ఎప్పుడయితే గర్వం పుట్టిందో - ఆవేళ్టి నుంచే అతనికి కీర్తి తగ్గుతూ వచ్చింది. అతని వుపన్యాసాలు వినేవాళ్లు తక్కువ అయారు. ఇదివరకిటిలా అతని నెవరూ ఎక్కువగా మెచ్చుకోడం లేదు. బౌద్ధమతాన్ని ఎవరూ కొత్తగా స్వీకరించారు కాదు. ఉన్నవాళ్లే ఎందరో తిరిగి బయ టకు వెళిపోయారు.

ఓనాడు ఓ రాజవీధిలో ఆనందుడు బోధలు చేయడం ప్రారంభించాడు. కానీ, ఆ బోధలు ఎవరూ వినడంలేదు! కొందరు పకపకా నవ్వుతున్నారు. మరి కొందరు చప్పట్లు చరచి గోలచేస్తున్నారు.

ఆనందుడు మరింత బిగ్గరగా అరిచాడు. దాంతో ప్రజలు రెచ్చిపోయి ఆనందుడిమీద రాళ్ళురువ్వడం మొదలు పెట్టారు. ఆనందుడి కేమీ తోచిందికాదు!

ఇంతలో ఆనందుడున్న చోటుకు దగ్గరగా ఒక బ్రాహ్మ ణాల కుర్రాడు మూర్ఛవచ్చి పడిపోయాడు. ప్రజలంతా అతని దగ్గరకు పరుగెత్తారు. అంతా ఆ కుర్రాడి చుట్టూ మూగారు.

బ్రాహ్మణులలో ఒక ఘనుడు "పిడికేదో-దయ్యమో, భూతమో పట్టింది. చితక తన్నండి - దయ్యం ఒదుల్తుంది!" అన్నాడు.

అతనలా అనడంతోనే, అంతా ఆ కుర్రాణ్ని బాదడం మొదలెట్టారు. ఇది ఆనందుడు చూశాడు. గబగబా వెళ్ళి ఆ గుంపును తోసుకుని లోపలకు వెళ్ళాడు.

"దూరంగా పొండి-!" అని అరిచాడు ఆనందుడు. అంతా హడలిపోయారు. అంతా దూరంగా వెళ్ళి నుంచున్నారు. ఆనందుడు ఆ కుర్రాడి ముందు మోకాళ్ళమీద కూర్చుని, దైవ ప్రార్థన మొదలెట్టారు.

ఆనందుడు ప్రార్థన చేస్తూ-అరగంట దాటింది కానీ, ఆ కుర్రాడు మూర్ఛను-చి లేవలేదు, కదలనయినా కదల్లేదు. ఆనందుడి ప్రార్థనకూడా ముగియలేదు.

కొంత సేపటికి ఆ కుర్రాడికి తెలివి మామూలుగా వచ్చేసింది. ఆనందుడు అంతవరకూ ప్రార్థన చూస్తూనే వున్నారు. ఆ కుర్రాడు లేవగానే ఆనందుడు లేచి నుంచొని, పెద్దగా దేవుణ్ని ప్రార్థించాడు.

అంతా నివ్వెరపోయారు. అందరూ ఆనందుడిమహిమే అనుకున్నారు. ఆనందుణ్ని మెచ్చుకున్నారు. అతని పాదాలకు మొక్కి "మహానుభావుడు" అన్నారు. ఆనందుడు ఇది చూచి ఎంతో సంతోషించాడు ఎందరో బౌద్ధమతం పుచ్చుకున్నారు. అంత గొప్పమతం లేనే లేదన్నారు.

'అందరూ బౌద్ధమతం స్వీకరిస్తున్నారు. అంతేచాలు!' అనుకున్నాడు ఆనందుడు. కానీ, ప్రజలను మోసగించానే అన్న ఆలోచనే లేదతనిలో!

ఆనందుడి కీర్తి రాజ్యమంతా ప్రాకిపోయింది. చివరకు ఆనందుడి మహిమను గురించిన విషయం రాజుగారి చెవిని కూడా పడింది. వెంటనే రాజుగారు ఆనందుణ్ని పిలుచుకొని రమ్మన్నారు.

రాజుగారి ముందు ఆనందుణ్ని హాజరుపరిచారు. రాజుగారు ఆనందుణ్ని అడిగారు 'అయ్యా! మీరు దయ్యాన్ని పోగొట్టినమాట నిజమేనా?' అని.

'నిజమే' అన్నాడు ఆనందుడు.

'సమయానికి నా రాజ్యం వచ్చారు. మీరు నా కొడుకును బ్రతికించాలి!' అన్నారు రాజుగారు.

'మీ కొడుక్కు వున్న వ్యాధేమిటో చెబుతారా?' అని అడిగాడు ఆనందుడు.

'ఏమీలేదు–! ఇవాల్టికి ఇరవై తొమ్మిది రోజుల్నుంచీ వంటిమీద తెలివిలేదు! ఇరవై తొమ్మిదిరోజుల క్రిందట మూర్ఛ వచ్చింది! అంతే, ఆ వేళ మూసిన కన్ను ఇవాళ వరకూ తెరవలేదు! మీరు నా కొడుకును బ్రతికించారంటే మీ కోరికలన్నీ తీరుస్తాను' అన్నారు రాజుగారు.

'రాజా! చిన్న మనవి–అ బ్రాహ్మణకుమారుడు సామాన్యమైనవాడు. అదీ, అతనికి మూర్ఛవచ్చిన వెంటనే వెళ్ళి

నా శక్తి నుపయోగించి బ్రతికించాను. కానీ, మీ కొడుకు సామాన్యమైనవాడు కాదు! అంతేగాకుండా మూర్ఛవచ్చి ఇరవై తొమ్మిదిరోజులు అవుతోంది! అటువంటవాణ్ని బ్రతికించేందుకు నాకున్న శక్తులు చాలవు!' అన్నాడు ఆనందుడు.

'ఐతే, ఆ శక్తులు సంపాదించాలంటే ఏం చెయ్యాలి?' అని అడిగాడు రాజుగారు.

"కోరికలను చంపుకొని, యోగాభ్యాసం చెయ్యాలి!" అన్నాడు ఆనందుడు.

"సరే, ఆ శక్తులు మీ దగ్గర లేనందువల్లనే కదా నా కొడుకును బ్రతికించ లేకున్నారు. ఆ శక్తులు సంపాదించేందుకుగాను తగిన యేర్పాట్లు చేయిస్తాను" అని-బ్రాహ్మల్ని పిలిపించారు రాజుగారు.

వాళ్ళతో-"ఇతన్ని మీ ఆధీనం చేస్తున్నాను. ఇతను యోగాభ్యాసంచేసి-దైవ మహిమను సంపాదించాలి! అందుకుగాను మీరు తగిన సదుపాయాలు చెయ్యండి!" అన్నారు రాజుగారు.

ఆనందుడు ఇదివిని ఏమో అనబోయాడు కానీ, బ్రాహ్మణులు ఆనందుణ్ని తన వెంట తీసుకు వెళ్ళిపోయారు.

బ్రాహ్మణులంతా ఆనందుణ్ని ఒక దేవాలయానికి తీసుకువచ్చి - అతని బట్టలన్నీ ఊడదీసి దిగంబరిని చేశారు. అతని శరీరమంతా పరీక్షగా చూశారు.

ఒక బ్రాహ్మణుడు అన్నాడు - "ఇతని శరీరంమీద ఒక్క గాయంకానీ, ఒక్క మచ్చకానీ లేదు. ఇంతవరకూ

ఇతనేమి కష్టపడనట్టుగాఉంది-! కష్టపడకుండా దైవమహిమ సంపాదించడం కష్టం! అందువల్ల ఇతణ్ణి కష్టపెట్టాలి" అని.

వెంటనే రెండు కొరడాలు తెప్పించారు. ఆనందుడు చెప్పే మాటలయినా వినకుండా - అతన్ని నలుగురు కలిసి బోర్లగిలా పడుకోబెట్టి, కొరడాలతో బాద నారంభించారు.

"అమ్మో! - బాబో -!" అని ఆనందుడు అరిచినా వదల్లేదు వాళ్ళు

'మీకు దండం పెడతాను-నన్ను వదలండి!' అన్నాడు ఆనందుడు.

'ఏం-లాభం లేదు! చర్మం లేచిపొయ్యేలా కొట్టండి-!!' అన్నాడు, వేదాలన్నీ వల్లెవేసిన మహానుభావుడు.

ఆనందుడి వంటిమీది చర్మం లేచిపోయేలా కొరడాలతో బాదేరు. ఆనందునికి స్పృహ తప్పిపోయింది.

'సరే, ఇతనినీ రాత్రి ఇలాగేవుంచితే మంచిది! మిగతా పని రేపు కానిద్దాం.' అని, గుడి తలుపులు వేసి వెళ్ళి పోయారు బ్రాహ్మణులు.

కొంతసేపటికి ఆనందుడు లేచి నుంచొని, వూపిరి వున్నంతవరకూ-'నీళ్లు' అని అరిచాడు. కానీ ఎవరూ పలక లేదు.

కన్ను పొడుచుకున్నా కానరానంత చీకటిగా వుంది లోపల. ఆనందుడు కొన వూపిరితో మూలుగుతున్నాడు. ఇంతలో - గోడమీద తెల్లని నీడ ఒకటి పడింది. అటు చూశాడు ఆ... ...ఏదూ. అదొక దయ్యం! -

'ఆనందా! నీకు మేలు చెయ్యాలని వచ్చాను. నే చెప్పి నట్టు చేస్తానంటే – నీకు మేలు చేస్తాను' అన్నదా దయ్యం.

'ఏమిటది?' అని మూలిగాడు ఆనందుడు.

'ఏం లేదు – నీ గురువుగారి మాటను తప్పి. అన్యాయానికీ, అధర్మానికీ పూనుకోవాలి!' అన్నది దయ్యం.

ఆనందుడు మౌనంగా వూరుకున్నాడు.

'అలా చేశావా – ఈ రాజుగారు నిన్ను మెచ్చుకుంటారు. నీ గాయాలన్నీ ఇట్టే మానిపోతాయి! అంతే కాదు, ఈ రాజ్యంలో ప్రజలంతా బౌద్ధమతం స్వీకరిస్తారు!! ఏమంటావ్?' అని అడిగింది దయ్యం.

'నా గాయాలు మాడిపోతాయా?' అని అడిగాడు ఆనందుడు.

'ఈ క్షణంలోనే మానిపోతాయి. ఐతే, గురువుగారి మాటను త్రోసిపుచ్చాలి!' అన్నదా దయ్యం.

'రాజుగారి కొడుకు బ్రతుకుతాడా? –' అని అడిగాడు ఆనందుడు.

'బ్రతుకుతాడు – ఎలాగో కూడా చెబుతున్నా విను. రేపటికి రాజుగారి కొడుక్కి మూర్ఛవచ్చి ముప్పయి రోజులు పూర్తి అవుతాయి. ముప్పైయొక్క రోజు పూర్తి కాగానే రాజుగారి కొడుక్కు మామూలుగా తెలివి వస్తుంది. ఆసమయం చూసి నువ్వు వెళ్ళి – ఏవో కల్లబొల్లి మంత్రాలు చదివి తేసరి, అదంతా నీ మహిమే అనుకుంటారు. రాజుగారు బౌద్ధమతం

పుచ్చుకుంటారు. తర్వాత ప్రజలుకూడా బౌద్ధమతం పుచ్చు కుంటారు. నువ్వు కానీ, గురువుగారి మాటని త్రోసిపుచ్చ డానికి ఇష్టపడకపోతే- నీ కష్టాలు ఇంకా పెరుగుతాయి. రేపు ఆ బ్రాహ్మణులు వచ్చి వున్న చర్మంకూడా ఒలిచేస్తారు. ఏమంటావు? - గురువుగారి మాట నతిక్రమిస్తావా?' అని అడిగింది దయ్యం.

'ఆ' అన్నాడు ఆనందుడు. దయ్యం అతని దగ్గరకు వచ్చి వీపు నిమిరింది. ఆశ్చర్యం! - అంత బాధా ఇట్టే మాయమయింది. అంతేకాదు, చర్మం ఒలిచేసిన మచ్చలు కూడా లేవు! ఆనందుడు లేచాడు.

'నే వెళ్తాను! నే చెప్పినట్టు చెయ్యి -! ఎప్పుడయినా అవసరం వస్తే 'హూంగీ - పద్మి - మాని - ఆమువా' అన్న మంత్రం జపించు! నేను వస్తాను' అని దయ్యం మాయ మయింది!

తెల్లవారింది. బ్రాహ్మణులు, ఇద్దరు సేవకులను వెంట బెట్టుకు వచ్చారు. ఆనందుణ్ని చూసి ఆశ్చర్యపోయారు.

'పదండి-! రాజుగారి కొడుకును బ్రతికిస్తాను' అన్నాడు ఆనందుడు.

ఆనందుణ్ని రాజుగారి దగ్గరకు తీసుకొచ్చారు.

'నా కొడుకును బ్రతికిస్తే - నేను బౌద్ధమతం స్వీక రించడమే కాకుండా - నా రాజ్యంలోవున్న ప్రజ లందర్నీ బౌద్ధమతంలో చేర్పిస్తాను' అన్నాడు రాజుగారు.

'బ్రతికిస్తాను' అన్నాడు ఆనందుడు. తర్వాత ఆనందుడు తనకున్న వాక్చాతుర్యంతో - ఇతర మతాల్ని దూషించి - బౌద్ధమతం గొప్పదనీ, అది స్వీకరిస్తే - మరణించిన వాళ్లను బ్రతికించే శక్తికూడా లభిస్తుందన్నాడు.

సూర్యాస్తమయం అయింది. రాజుగారి కొడుక్కు తెలివి వచ్చే సమయం వచ్చింది. ఆనందుడు - దైవప్రార్థన ఆరంభించాడు. 'డాం - డూం' అని ఏవో మంత్రాలు చదివాడు.

కొద్దిసేపట్లో రాజుగారి కొడుక్కు తెలివి వచ్చింది. ఆ మహిమ ఆనందుడిదే అని అనుకున్నారందరూ.

'మానవుడు కాదు - మహానుభావుడు' అన్నారు ఆనందుణ్ణి! అంతా అతని పాదాలను పూజించారు.

రాజుగారు బౌద్ధమతం స్వీకరించారు. అంతేకాదు, రాజ్యంలో ప్రజలంతా బౌద్ధమతం స్వీకరించాలని శాసించారు.

ఆ మర్నాడు దేవాలయాలన్నీ మూయబడ్డాయి. హిందూమతం కోసం, దేవాలయాలకోసం ఇచ్చిన విరాళాలు తిరిగి లాగేసుకున్నారు రాజుగారు. బౌద్ధమతం పుచ్చుకుందుకు ఇష్టపడనివాళ్లని నిర్బంధించారు. అంతేకాదు. మొండిగా వున్నవాళ్లను శిక్షించారు కూడా.

హిందూమతం చేసిన పాపానికీ, హింసకూ వెయ్యిరెట్లు హింస - బౌద్ధమతం పేర కొద్ది రోజుల్లోనే జరిగింది!-

ఆనందుడి ఆనందానికి మేర లేదు. రాజ్యంలో ప్రజలంతా బౌద్ధమతం స్వీకరించారని వుబ్బిపోయాడు.

ఆనందుడితో రాజుగారు అన్నారు – "ఆనందా! యువరాజుకి అన్ని విద్యలూ మీరే నేర్పించాలి! బౌద్ధ మత బోధలను బోధించండి!!" అని.

'సరే' నన్నాడు ఆనందుడు.

కానీ, యువరాజుకీ, బౌద్ధమతానికీ భూమికెంత భేదం వుంది. బౌద్ధమత సిద్ధాంతాలకు, యువరాజు పూర్తిగా భిన్నం! అతనికి హింస అంటే ఆనందం – పురుగులను సూదులతో గుచ్చి – నిప్పుల్లో కాల్చి సంతోషిస్తాడు యువరాజు! రెంటికీ పొత్తేదీ? –

కొద్ది రోజులు గడిచినయ్. రాజుగారు ఒకనాడు ఆనందుణ్ని పిలిపించారు.

"ఆనందా! మీ అవసరం మళ్ళీ కలిగింది – ! మన రాజ్యంమీదకు శత్రురాజు ఒకడు దండెత్తి వచ్చాడు. ఆ శత్రురాజు సేన, మన సైన్యాన్ని పిప్పి చేసేస్తోంది! అందుకు గాను – మీరు ఎలాగయినా యోగాభ్యాసం చేసి – తక్కువ కాలంలో ఎక్కువ శక్తి సంపాదించి ఆ శత్రురాజును వోడించేలా చెయ్యాలి! – అందుకనే ఆ తలార్లను పిలిపించాను!" అన్నారు రాజుగారు.

ఆనందుడు తలార్లని చూశాడు. భయంకరంగా, నల్లగా, లావుగా – యమకింకరుల్లా వున్నారు.

"వాళ్ళిద్దర్నీ మీకోసమే పిలిపించాను. ఈసారి బ్రాహ్మణులు లేరుకదూ - అందుకని! వాళ్ళలో మొదటి వాడు మిమ్మల్ని - తలక్రిందులా వ్రేల్లాడదీసి - క్రింద మంట పెట్టి, కళ్ళల్లో కారం పెడతానంటున్నాడు. రెండోవాడేమో- మీ చర్మం ఒలిచేసి కళ్ళల్లోనూ, నోట్లోనూ కారం పోస్తా నంటున్నాడు. మీకు ఈ రెంటిలోనూ ఏది కష్టం? - ఏంచేస్తే ఎక్కువ శక్తి మీరు సంపాదించ కలుగుతారు? -" అని అడిగారు రాజుగారు ఆనందణ్ని.

"ఈ రెండూ కూడా అంత మంచివి కావు!" అన్నాడు ఆనందుడు సగం చచ్చి.

"పోనీ, అవి రెండూ నచ్చనప్పుడు—రెండూ కలిపి చేసేద్దాం! మీరు ముందుగా ఏది చెయ్యాలో రేపు పుదయం చెబితే, మీ ఇష్టప్రకారం చేయిస్తాను" అన్నారు రాజుగారు.

దాంతో ఆనందుడికి నోటంట మాట రాలేదు. 'అలాగే' అన్నట్టుగా తలాడించి - తననివాసానికి వెళ్ళి పోయాడు.

అర్ధరాత్రి అయింది -

తెల్లవారేలోగా ఏదో ఒకటి తేల్చాలి! లేకుంటే - వాళ్ళు తన పని కాస్తా ముగించేస్తారు అని ఆలోచిస్తూ కూర్చున్నాడు ఆనందుడు.

వెంటనే ఆనందుడికి దయ్యం గుర్తుకు వచ్చింది. గబ గబా ఒంటరి ప్రదేశానికి వెళ్ళి - దయ్యం మంత్రం జపించాడు.

దయ్యం ప్రత్యక్షం అయింది. కానీ, ఆ దయ్యం జోగి వేషంలో వుంది. కాషాయిగుడ్డలూ, వీబూదిరేఖలూ, మెడలో పుర్రెలదండ – చేతిలో కపాలం – వున్నాయి. ఆ ఆకారం చూసి నివ్వెరపోయాడు ఆనందుడు.

"సాతోరా! తొందరగా – జోగివేషం వేసుకుందువు గాని!" అన్నదా దయ్యం.

"జోగి వేషమా ?..." అన్నాడు ఆనందుడు. జోగి వేషమంటే – ఆనందుడికి పరమ అసహ్యం! కానీ, ప్రాణం మీద వున్న తీపితో – గత్యంతరం లేక దయ్యాన్ని అనుసరించాడు.

ఆ దయ్యం ఆనందుడికి గుండుచేసి – వీబూది పూసీ, కాషాయి గుడ్డలు కట్టింది! – తర్వాత ఆనందుణ్ని శ్మశానంలోకి తీసుకువెళ్లింది. శ్మశానంలో శవాలు ఎన్నో కాలుతున్నాయి. ఎండిపోయిన చెట్లతోనూ, నక్కల అరుపులతోనూ శ్మశానం భయంకరంగా వుంది!

ఆ దయ్యం చిన్నపిల్లల పుర్రెల్ని ఏరుకొచ్చి దండగా గుచ్చి ఆనందుడి మెడలో వేసింది. ఒక పెద్ద కపాలం చేతికిచ్చి, ఎముకతో దానిని వాయించమన్నది. దయ్యం కూడా తన చేతిలోవున్న పుర్రెమీద, ఎముకతో వాయించింది!— ఆనందుడు కూడా ఆలాగే చేశాడు!

హఠాత్తుగా పెద్ద గాలీ, వర్షం ప్రారంభం అయినయ్! పెద్ద పెద్ద మంచు ముక్కలు మీద పడేస్తున్నట్టుగా వుంది వర్షధార. దయ్యం ఏవో మంత్రాలు చదువుతోంది.

ఆనందుడు మరింత గట్టిగా పుర్రెమీద ఎముకతో బాదేడు. వెంటనే వర్షం వెలిసింది!

దయ్యం ఆనందుడితో అన్నది: "ఆనందా! నే వెళ్తున్నాను. శత్రురాజు వోడిపోయాడు. రాజుగారు ఇదంతా నీ మహిమే అనుకొని, జయ జయ ధ్వానులతో వస్తున్నారు!" అని అదృశ్యమయి పోయింది!

ఇంతలోనే రాజుగారు ఆనందుడి దగ్గరకు వచ్చారు. "ఆనందా! మీ దయవల్ల విజయం సాధించాము! ఇదంతా మీ మహిమే,! మీరు ఈ శ్మశానంలోనే వుంటే, అవసర మైనప్పుడు వుపకరిస్తారు. కాబట్టి మీకు ఇక్కడే తగిన ఏర్పాట్లు చేయిస్తాను! సెలవు!!" అని వెళ్ళిపోయారు రాజుగారు.

ఆనందుడు గత్యంతరం లేక 'ఉఁ' అన్నాడు. కాదంటే ఏమంటాగో అని భయం పాపం!

స్మశానానికి దగ్గరగావున్న పాడుబడ్డ గుడి బాగు చేయించి ఆనందుడికిచ్చారు. ఆ నందుడు – నిద్ర లేక వున్నాడేమో – అందులో నిద్రపోయాడు!

ఆ మర్నాడే – ఆనందుడి తలమీద మరో బండ రాయి పడింది!–

"రాజుగారికి హఠాత్తుగా జబ్బు చేసింది! వెంటనే తగ్గేలా చేయ్యాలి!" అని–

ఆనందుడికేమీ పాలుపోయింది కాదు! ఏవేవో మంత్రాలు చదివి – పుర్రెమీద ఎముకతో చేతులు నొప్పి పుట్టేలా వాయించేడు.

కానీ, ఏం లాభం? – "రాజుగారికి జబ్బు ఎక్కువ అయింది!" అని కబురొచ్చింది!

"ప్రభూ! ఆనందుడు రాజ్యం కాజెయ్యాలని – మీ వ్యాధి అంతకంతకూ ఎక్కువయ్యేలా చేస్తున్నాడు. నేనిప్పుడే అతణ్ని బెదిరించి వస్తాను!" అని రాజవైద్యుడు ఆనందుడి దగ్గరకు వచ్చాడు!

"ఆనందా! మీరు – రాజుగారి వ్యాధిని ఎక్కువ చెయ్యాలని చేస్తున్నారల్లే వుంది! మీరు చచ్చిపోయిన రాజ కుమారుణ్ని బ్రతికించారు! వోడిపోయిన రాజ్యం గెలిపించారు!! ఆ కార్యాల్లో ఇదెంత? – తొందరగా వ్యాధి నయం చెయ్యండి!" అన్నాడు రాజవైద్యుడు.

ఆనందుడిది విని – దయ్యాన్ని పిలిచాడు, మంత్రం జపించాడు. కానీ, దయ్యమూ రాలేదు, భూతమూ రాలేదు! "నాకు శక్తి లేదయ్యా!" అన్నాడు ఆనందుడు.

"ఐతే, ఇదో ఈ విషం తీసుకొని మీ మహిమ వల్ల తయారుచేసిన మందు అని రాజుగారికివ్వండి! రాజు గారు చచ్చిపోతారు. అతని వారసుడు మిమ్మల్ని మెచ్చుకుంటాడు!" అని విషం వున్న పాత్ర అందించాడు వైద్యుడు.

"వద్దు – వద్దు! ఇంతవరకూ చేసిన పాపాలు చాలు! హంతకుణ్ని కూడా కాలేను!–" అన్నాడు ఆనందుడు.

"ఐతే, అటు చూడండి-!" అన్నాడు వైద్యుడు. ఒక పెద్ద పాత్రలో నూనె సలసలా మరుగుతోంది!

"నూనె దేనికి? ఎందుకు మరిగిస్తున్నారు!" అని అడిగాడు ఆనందుడు.

"మీరు రాజుగార్ని బ్రతికించకపోతే మిమ్మల్ని ఆ నూనెలో పడేస్తాము!" అన్నాడు వైద్యుడు.

"నన్నే!" అని కన్నీళ్ళు కార్చేడు ఆనందుడు.

"ఒకటే - రాజుగార్ని బ్రతికించండి! - లేకుంటే-విషం ఇచ్చి చంపండి! ఏదిచేసినా ఈ నరకం తప్పుతుంది! బాగా ఆలోచించుకోనండి! సాయంత్రంవరకూ వ్యవధి వుంది! ఈ లోగా నూనెకూడా మరుగుతుంది!" అని రాజవైద్యుడు వెళ్ళి పోయాడు.

ఆనందుడు ఆ నూనెను చూసి కళ్ళు గట్టిగా మూసు కున్నాడు - "విషం ఇచ్చి - రాజుగార్ని చంపేస్తేనో -" అను కున్నాడు.

వికృతమయిన అరుపులు వినిపించాయి. అటు చూశాడు. యమకింకరుల్లా వున్నారు. వాళ్ళలో కొందరు ఒక పాత్రలో సీసం కరగబెడుతున్నారు. మరికొందరు ఇనుము కరగబెడుతున్నారు. ఇంకా కొందరు ఇనపకడ్డీలు - ఎర్రగా కాలుస్తున్నారు.

ఇది చూసి ఆనందుడు వాళ్ళ దగ్గరకు వెళ్ళి-వాళ్ళను మెల్లగా అడిగాడు - "దేనికిదంతా?" అని.

"ఇవాళ బుద్ధదేవుని ప్రియ శిష్యులలో ముఖ్యుడయిన ఆనందుడు వస్తున్నాడు!-అందుకని-" అన్నారు కింకరులు.

"ఎందుకూ ?-" భయంగా అడిగాడు.

"ఎందుకేమిటి ?-రాజుగారిని రహస్యంగా విషం ఇచ్చి చంపినందుకు!" అన్నారు కింకరులు.

ఆనందుడు మరింత భయంగా అడిగాడు-"అవన్నీ ఏం చేస్తారు ?-" అని.

"ఆనందుణ్ని - సీసంలో పడేసి, ఇనుము కళ్ళల్లోను, నోట్లోను పోస్తాము!" అన్నారు వాళ్లు.

అది వినగానే ఆనందుడు "బుద్ధదేవా!" అని బిగ్గరగా అరిచాడు. తీరా చూస్తే అదంతా కల!

ఆనందుడు కళ్ళు నులుముకున్నాడు - కళ్ళముందు, నూనె పాత్ర, పాత్రలో సలసల మరుగుతున్న నూనె కనిపించేయి.

దాన్ని చూసి, ఆనందుడు కన్నీళ్ళతో: "బుద్ధదేవా! నన్ను క్షమించి. రక్షించు! నీ మాటను త్రోసిపుచ్చి ప్రజలను మోసగించాను! అన్యాయానికీ, అధర్మానికీ పూనుకున్నాను! నన్ను రక్షించు!!

"బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి" అని, బుద్ధదేవుణ్ని ప్రార్థించాడు.

"ఆనందా!" అని ఎంతో దయతో, శాంతంగా, ఆప్యాయంగా పిలిచిందో కంఠం.

అటు చూశాడు ఆనందుడు.

"తప్పు తెలుసుకున్నావా, ఆనందా?" అని అడిగిందా అమృత కంఠం.

"తెలుసుకున్నాను ... దర్శన మివ్వు స్వామీ!" అని చెంపలు వాయించు కున్నాడు ఆనందుడు.

ఎదురుగా తెల్లని కాంతితో, చిరునవ్వుతో నుంచు న్నాడు బుద్ధదేవుడు. ఆనందుడు అతని పాదాలమీద వాలి పోయాడు.

"దేవా! నీ పవిత్ర పాదాలనుకూడా తాకేందుకు అర్హతలేని పాపిని!" అన్నాడు ఆనందుడు.

"ఫర్వాలేదు ఆనందా! తప్పులన్నవి ప్రతి మానవుడూ చేస్తాడు! తప్పును తెలుసుకుని సరిదిద్దుకోటంలోనే వుంది గొప్పతనం! నువ్వు నీ గురువు మాటని త్రోసిపుచ్చావు! అందుకే ఇంతవరకూ వచ్చింది! దయ్యం కనిపించి బాధ నివా రణ చేస్తానూ - అనగానే గురువుమాట నతిక్రమిస్తానన్నావు. లేకుంటే ఇన్ని బాధలకు గురి అయేవాడివి కాదు! అయినా, జరిగినదానికి విచారించి లాభంలేదు.

నా శిష్యులందరూ తిరిగి వచ్చారు. రేపు శ్రావస్తీ నగరంలో సమావేశ మవుతారు. వాళ్ళు తమ బోధలగురించి అన్ని విషయాలు చెబుతారు! నువ్వుకూడా నీ విషయం చెబుతావా?" అని అడిగాడు బుద్ధదేవుడు.

"తప్పకుండా—నా తప్పులను నేనే చెప్పుకొని, ఆ అవమానాన్ని నేనే భరిస్తాను!" అన్నాడు ఆనందుడు.

'సరే, పద!—రాజుగారిని విషం ఇచ్చి చంపేశారు! ఆ నింద నీమీద పడ్డది! ప్రజలు నిన్ను హతమార్చేందుకు వస్తున్నారు! త్వరగా పద!!' అన్నాడు బుద్ధుడు.

'దేవా! నే చేసిన తప్పువల్ల—ఈ నగరంలో బౌద్ధమతం నశించ వలసిందేనా?—' అని అడిగాడు ఆనందుడు.

'తప్పకుండా—నశించాల్సిందే—! నువ్వు కల్లిబొల్లి కబుర్లతోనూ, మోసపు కార్యాలతోనూ, వాళ్ళను బౌద్ధమతస్థులను చేశావు! దేవుడు చెప్పిన సత్యంఅయినా అబద్ధాలతోనూ అద్భుతాలతోనూ ప్రచారం చెయ్యకూడదు! అటువంటి మతం ఇలాగే నశిస్తుంది! – ఇప్పటికి నువ్వు నిజం తెలుసుకున్నావు కదా—! ఇకముందు మిగతా రాజ్యాల్లోనైనా క్రమమయిన మతబోధ చేద్దువుగాని—పద!' అన్నాడు బుద్ధదేవుడు. ఆనందుడు అనుసరించాడు.

—:o:—

(5)

# విశ్వాసం

జోటో కళాశాల ఉపన్యాసకుడు. అతనికి నా అన్న వాళ్ళెవ్వరూ లేరు. ఒక్క రీటా తప్పితే.

రీటా అతని పెంపుడు కుక్క. రీటా అంటే అతనికెంతో ప్రేమ. అందువల్లనే రీటాని తన ప్రాణంతో సమానంగా చూసుకొనేవాడు. రీటాకూడా యజమానికి ప్రాణాలయినా యిచ్చేందుకు సిద్ధంగా ఉండేది.

జపాను దేశానికి ముఖ్యనగరం "టోకియో". టోకియోకి కొద్ది దూరంలోనే వున్న ఒక పల్లెలో ఉంటున్నాడు జోటో. జోటో ప్రతీరోజూ "ఎలక్ట్రిక్ ట్రెయిన్" లో టోకియో వెళ్లేవాడు. ఆయన "టోకియో"లో వుండే కళాశాలలోనే పని చేస్తున్నాడు. ఆయన స్టేషన్‌కి వెళ్ళేప్పుడు రీటా కూడా అతని వెంట వెళ్ళేది.

జోటో భోజనంచేసి, బట్టలు వేసుకొని పుస్తకాలు పుచ్చుకొని బయలుదేరే సమయానికి ఎక్కడ వున్నాసరే... వచ్చి, గుమ్మంలో సిద్ధంగా నుంచొనేది రీటా.

రైలుస్టేషన్ జోటోవుండే బంగళాకి ఎలా లేదన్నా రెండు, మూడు ఫర్లాంగులు దూరం ఉండేది. జోటో బంగాళా నుంచి, స్టేషన్‌కి కాలినడకనే వెళ్ళేవాడు. అతని వెనకాలే వెళ్లేది రీటా.

రైలు వచ్చేంతవరకూ, అతనితో కూడా తిరిగేది. ఆయన రైలు ఎక్కగానే తోకాడిస్తూ అతనికి "టాటా" చెప్పి, బంగళాకు తిరిగి వచ్చేసేది రీటా.

తిరిగి సాయంకాలం రైలు వచ్చే వేళకు స్టేషన్‌కు వెళ్ళేది. రైలు వచ్చేవరకూ ఉండేది. రైలు రాగానే యజమానికోసం యెదురు చూసేది. ఆయన కనిపించగానే గబగబా వెళ్ళి, తోకాడిస్తూ అతని కాళ్ళని చిట్టేసేది. జోటో రీటాతో కలిసి బంగాళాకు వచ్చేసేవాడు. ఇలాగే రోజూ జరుగుతూ ఉండేది.

ఓనాడు రీటా మామూలుగా యజమానితో స్టేషన్‌కి వెళ్ళి, ఆయన రైలు యెక్కగానే "టాటా" చెప్పి వచ్చేసింది బంగళాకి.

జోటో కళాశాలకి వెళ్ళేవరకూ బాగానే వున్నాడు. తీరా ఆయన కాలేజీలో ఉపన్యసిస్తూండగా... హఠాత్తుగా గుండె జబ్బు చేసింది. మాట్లాడుతూనే...కింద పడిపోయాడు!

ప్రిన్సిపాల్ వెంటనే డాక్టర్‌కోసం కబురు చేశాడు. కానీడాక్టర్ వచ్చేవరకూ వ్యవధి చాలింది కాదు. డాక్టర్ వచ్చేసరికి ఆయన మరణించాడు.

జోటో మరణిస్తూ, ప్రిన్సిపాల్‌తో చెప్పాడు-

"నేను చిన్నప్పుడు ఈ కాలేజీలోనే చదువుకున్నాను. ఈ కాలేజీలోనే ఉద్యోగం అయింది! ఇప్పుడు...యీ కాలేజీ లోనే మరణిస్తున్నాను. అందువల్ల కడసారిగా మిమ్మల్ని కోరేదేమిటంటే నా శవాన్ని యీ కాలేజీ ఆవరణలోనే యెక్క-

డయినా సమాధి చెయ్యమని! అంతే! మరో చిన్నమాట...
అది రీటా..." అని ఇంకేమో చెప్పబోయాడు.

కానీ, బాధగా మూలుగుతూ, గుండెని చేత్తో పుచ్చుకొని, ఆ మాట చెప్పకుండానే మరణించాడు. రీటాగురించి యేం చెప్పాలనుకున్నాడో మరి? ...

ప్రిన్సిపాల్ కూడా జోటో కడసారిగా చెబుతూ వదిలేసిన "రీటా" గురించి అంతగా పట్టించుకోలేదు.

అసలు "రీటా" అన్నది కుక్క పేరని ఆయనకు తెలీనే తెలీదు. జోటో కోరిన ప్రకారం "జోటో" శవాన్ని ఆకాలేజీ ఆవరణలోనే సమాధి చేయించాడు.

ఇదంతా రీటాకి తెలీదుకదా :! రీటా రైలు వచ్చే వేళకు మామూలుగా స్టేషన్‌కు వచ్చింది. రైల్లో జోటో గాలేదు. జోటో వుంటేకదా వస్తాడు. పాపం!..రీటా ప్రతీ పెట్టెనీ ఆత్రంగా చూసింది. ఆయన కనిపించలేదు. రైలు వెళ్ళిపోయింది. రీటా స్టేషన్‌లోనే ఆశగా నుంచుంది.

వచ్చే బళ్ళనీ, పోయే బళ్ళనీ అమాయకంగా, ఆత్రంగా చూసింది.

ఆయన రాలేదు. చీకటి పడింది. రీటా నిరాశతో బంగళాకి వచ్చేసింది. యజమాని గది తలుపుకి తాళం వేసి వుంది. పాపం...దాని కెవ్వరూ యిన్ని పాలయినా పొయ్యలేదు! అలాగే ఆకలి కడుపుతో పడుకుంది రీటా.

మర్నాడు ఉదయం యజమాని కోసం ఎదురుచూసింది. యజమాని కనిపించలేదు. తలుపుకి తాళం అలాగే వుంది.

రీటా తలుపు కన్నందగ్గర మూతి పెట్టి అరిచింది. దాని కళ్ళ నుంచి కన్నీళ్ళు కారేయి!...

ఏడుస్తూనే స్టేషనుకి వెళ్ళింది. రైళ్ళన్నీ పరికించి చూసింది. జోటో రాలేదు. మళ్లా బంగాళాకు వచ్చేసింది. తలుపులు మూసే వున్నాయి. తలుపుదగ్గర కూర్చొని ఎంతో సేపు ఏడ్చింది. కానీ...ఆ ఏడుపు ఎవరూ వినిపించుకోలేదు. పాపం!...

కొద్ది రోజులు గడిచేయి. జోటో బంగళాలో యెవరో క్రొత్త మనుషులు ప్రవేశించారు. వాళ్ళని రీటా యెందుకనో యేమీ అనలేదు. ఆ కొత్తవాళ్లు రీటాని చూసి, పిలిచి అన్నం పెట్టేరు. కానీ...రీటా ఒక్క మెతుకయినా ముట్టింది కాదు. దీనంగా లోపలికి చూసింది. అంతా కొత్తవాళ్ళే! అది యజమానిని స్టేషన్‌కి దిగబెట్టేవేళ. ఒంటరిగా స్టేషనుకి బయలుదేరింది రీటా.

రోజు రోజుకీ రీటా చిక్కి శల్యమయి పోతోంది! ఎవరు పిలిచినా పలికేది కాదు. రోజూ పొద్దుటా, సాయంత్రం కూడా స్టేషనుకి వెళ్ళేది. యజమానికోసం చూసేది. విచారంగా తిరిగి వచ్చేది!

స్టేషనులో స్టేషను మాస్టర్లూ, టి. సీ. లూ రీటాని చూశారు. రోజూ స్టేషనుకు రావడం – ఎవరికోసరమో ఎదురు చూడడం, వెళ్ళిపోవడం యిదంతా గమనించారు వాళ్లు

తర్వాత - ఫలానా ఉపన్యాసకుడు "జోటో"గారి కుక్కని తెలుసుకున్నారు. రీటాని చూసి దానికి యజమాని మీదవున్న భక్తి, విశ్వాసాలకి విస్తుపోయేవాళ్లు!...

కాలచక్రం తిరిగిపోతోంది. పాత ఉద్యోగులు రిటైరయి పోతున్నారు. కొత్త కొత్తవాళ్ళు వస్తున్నారు. కానీ... రీటా రెండు పూటలా స్టేషనుకు వస్తూనే ఉంది!

రీటా బాగా చిక్కిపోయింది. ఎముకలు బయటకు వచ్చేసేయి! దాన్ని చూస్తూంటే అందరికీ అసహ్యం వేసోంది!

ఆవేళ రీటా కొన ఊపిరితోనే స్టేషనుకు వచ్చింది. అసలు నడవనయినా నడవలేక ఆ ప్లాట్‌ఫారం మీదనే పడుకుంది.

ఆఖరిబండి టోకియోనుంచి వచ్చింది. రీటాకి ఎక్కడ లేని శక్తి వచ్చింది. లేచి నుంచుంది!...యజమాని కోసం చూసింది! యజమాని కనిపించలేదు.

రైలు వెళ్ళిపోయింది! రీటా ప్లాట్‌ఫారంమీద కూలిపోయింది! ఆవేళనే రీటా ప్రాణవాయువు అనంతాకాశంలో కలిసిపోయింది. అంతే!...

—: o :—

# నాలుగు పాదాలా న్యాయం !

ఢిల్లీ నగరాన్ని రాజధానిగా చేసుకొని భారతదేశాన్ని మొగలాయి చక్రవర్తి జహాంగీరు పరిపాలిస్తున్నాడు.

జహాంగీరు ప్రజలను కన్నబిడ్డల లాగా చూసుకుంటూ ఎంతో మెలకువగా రాజ్యం పాలించాడు. అతని పరిపాలనలో న్యాయం నాలుగు పాదాలా నడిచింది.

జహాంగీరు భార్య నూర్జాహాను. నూర్జాహాన్ చాలా అందమయినది. అందానికి తగిన తెలివి తేటలూ, శౌర్య పరాక్రమాలు కలది. రాజ్య పరిపాలనా విషయంలో భర్తకి సలహాలు కూడా యిస్తూ వుండేది.

తన రాజ్యంలో న్యాయమన్నది అందరికీ ఒకేలాగ జరగాలని జహాంగీరు అభిలాష ! ఆ ఉద్దేశంతోనే ఆయన తన రాజ్యంలో కోట గుమ్మానికి ఒక న్యాయగంట వేళ్ళాడ దీయించాడు. దానికి పెద్ద గొలుసు ఒకటి చేయించాడు. ఆ గొలుసు రాజబాటలోకి వేళ్ళాడుతూ వుండేది.

రాజ్యంలో ఎవరికి ఎలాంటి అన్యాయం జరిగినాసరే - ఆ గొలుసు పట్టుకు లాగేవాళ్ళు. వెంటనే ఆ గొలుసు లాగిన వారిని ఆస్థానంలోకి రప్పించి, విషయం తెలుసుకొని, విచారణ జరిపించేవాడు జహాంగీరు.

ఇలాగ అన్యాయం అన్నది ఎవరికీ జరుగకుండా రాజ్యం పరిపాలిస్తున్నాడు జహాంగీరు.

ఇలా వుండగా ఒకనాడు :

నూర్జహాన్ తన మహల్‌లో కూర్చొని - నది ఒడ్డున మాసిన బట్టలు వుతుకుతున్న చాకళ్ళను చూస్తున్నది.

అదే సమయంలో ఒక పావురం రివ్వున వచ్చి, ఉద్యానవనంలోవున్న చెట్టుమీద వాలింది. అది ఉబుసుపోని రాణీకంట బడింది. వెంటనే దాన్ని బాణంతో కొట్టాలని అనుకుంది నూర్జహాన్.

విల్లు ఎక్కుపెట్టి గురిచూసి బాణం వదిలింది. అయితే, ఇదంతా పావురం గమనించింది కాబోలు!...బాణం అల్లంత దూరాన్న వుండగానే "తుర్రు" మంది.

పావురం యెగిరిపోయిందని బాణం ఆగిపోతుందా?— అది రివ్వున వెళ్ళి బట్టలు వుతుకుతున్న చాకలికి వెన్నులో నుంచి దూసుకుపోయింది!—

చాకలి పెద్ద కేకవేసి చచ్చిపోయాడు!

అక్కడే వుండి బట్టలు ఆరవేస్తున్న అతగాడి భార్య భోరుమంటూ నెత్తి నోరూ మొత్తుకుంది.

తనకు జరిగిన అన్యాయాన్ని చెప్పుకుందికి పాదుషా వారి దగ్గరికి పరుగు తీసింది.

అప్పుడే భోజనం చేద్దామనుకొంటున్నాడు జహంగీరు. ఇంతలో న్యాయగంట 'గణగణా' మ్రోగింది.

వెంటనే చాకలిదాన్ని రప్పించి, "సంగతేమిటి" అని అడిగాడు జహంగీరు.

చాకలి కన్నీళ్ళతో జరిగిన సంగతి అంతా చెప్పింది.

సరే, వెంటనే సభ ఏర్పాటు చేయించాడు. న్యాయాధికారులూ, మంత్రులూ అంతా సమావేశమయ్యారు.

'బాణం అంతఃపురంలోనుంచి వచ్చి వుంటుందని న్యాయాధికారులు అంటున్నారు. కాబట్టి అంతఃపురంనుంచి బాణం వేసినవాళ్ళెవ్వరో హాజరు పెట్టండి!' అన్నాడు జహాంగీరు.

అంతఃపురానికి కబురు వెళ్ళింది.

సభికులందరూ 'బాణం వేసినదెవరా' అని ఎదురు చూస్తున్నారు. అంతలోనే దాసీలతో, ముసుగు వేసుకొని భారంగా అడుగులు వేసుకుంటూ వచ్చి బోనులో నుంచుంది మహారాణి నూర్జహాన్ !

అంతా ఆశ్చర్యబోయారు. జహాంగీరు నిశ్చేష్టుడయాడు!

మహారాణీ జరిగిన సంగతి చెప్పింది.

మహారాణీ నూర్జహాన్ను దోషిగా నిర్ణయించారు, న్యాయాధికారులు.

జహాంగీరు దోషికి శిక్ష విధించాలి!

అతని కళ్ళు ఎర్రబడ్డాయి! పెదవులు వణికేయి! అయోమయంగా వుండిపోయి, కొన్ని క్షణాల తర్వాత లేచి నుంచున్నాడు.

అందరూ అతని తీర్పుకోసం ఎదురు చూస్తున్నారు.

జహాంగీరు విల్లంబులను తీసుకురమ్మని సేవకుడికి ఆజ్ఞ యిచ్చాడు.

సేవకుడు విల్లంబులు తెచ్చి యిచ్చాడు.

జహాంగీరు మరొక్క అడుగు ముందుకు వేసి గంభీరంగా నుంచున్నాడు!

'చాకలీ! మహారాణీ నూర్జాహాన్ నీ భర్తని బాణంతో చంపి, నీ కెంతో కష్టాన్ని కలిగించినది! నిన్ను విధవగాచేసి ఆ పాపాన్ని ఒడిగట్టుకుంది.

మహారాణికి తన భర్తమీద ఎలాంటి ప్రేమా, అభిమానమూ వుంటాయో, నీకు కూడా నీ భర్తమీద అలాంటి ప్రేమా అభిమానమే వుంటాయి!

నా న్యాయానికి హెచ్చుతగ్గులు కానీ, జాతి మత భేదాలుకానీ లేవు! నా న్యాయంలో ప్రతీకారం, ప్రతిక్రియ జరిగి తీరవలసిందే!

నువ్వు ఇప్పుడు ఎంత దుఃఖిస్తున్నావో...ఎంత బాధపడుతున్నావో, అంత దుఃఖమూ...అంత బాధకూడా మహారాణీ అనుభవించి తీరాలి!

ఇదిగో ఈ విల్లంబులు తీసుకో! నీ భర్తని చంపిన ద్రోహికి నువ్వు చెయ్యాల్సిన ప్రతీకారం-ఆమె భర్తను చంపి, ఆమెను విధవగా చెయ్యడం!' అంటూ జహాంగీరు గద్దె దిగి వచ్చి, విల్లంబులను చాకలిదాని చేతిలో పెట్టాడు.

'వాటితో నన్ను చంపు! ఊఁ...కానీ!' అన్నాడు జహాంగీరు.

ఎవ్వరూ ఏం మాట్లాడలేకపోయారు. అలా బొమ్మల్లా వుండిపోయారు.

చాకలి విల్లంబులను జహాంగీరు పాదాలముందు వుంచి, వంగి నమస్కరించింది.

కన్నీళ్ళను చీర కొంగుతో తుడుచుకుంది.

'ప్రభూ! నే కోరిన న్యాయం నాకు లభించింది! నాకు అదే చాలు! నా భర్త లేకపోవడంవల్ల నేను ఒక్కదాన్నే కష్టపడతాను. కానీ, మీరు లేకపోయినట్లయితే భారత దేశమే కష్టాలపాలు అవుతుంది! ఇకముందు ఇంతటి న్యాయం కూడా లభించక పోవచ్చు! అందేత, మిమ్మల్ని యింతగా బాధపెట్టి నందుకు నన్ను మన్నించి, సెలవు ఇప్పించండి!' అంటూ వెళ్ళిపోబోయింది చాకలిది.

'ఆగు...నువ్వు యికముందు కష్టించనవసరం లేదు' నాకు పతిభిక్షని పెట్టడమే కాకుండా, దేశాన్నికూడా రక్షించావు! అందుకు కృతజ్ఞతగా, నీ జీవనోపాదికి అయిదు వూళ్ళు ఇస్తున్నాను.' అన్నది మహారాణీ ఆనందంతో!

చాకలిది ఆనందబాష్పాలు రాల్చింది!

—:o:—